# అన్నమాచార్యులు

చిల్లర భవానీదేవి

శ్రీ మానస ప్రచురణ

ప్రధమ ముద్రణ

మే - 2001

వెల. రు. **14-00**

లోపలి బొమ్మలు } కరుణాకర్
ముఖ చిత్రం }

# అన్నమాచార్యులు

భగవంతుడిని పొందటానికి జీవుడు వెదకటం అనాదిగా జరుగుతోంది. దేవుని గురించి అనేక కీర్తనలను రచించిన వారెందరో ఉన్నారు. వారిలో తాళ్ళపాక అన్నమాచార్యులు తొలి తెలుగుకవి. అన్నమయ్యను తొలిపద కవితాపితామహుడు అంటారు. హరి సంకీర్తనాచార్యుడూ ఈయనే ! అన్నమయ్యలో సంగీతం, నృత్యం మరియు భజన కలిసి ఉన్నాయి. తర్వాతి కాలంలో సంగీతాన్ని త్యాగరాజు స్వీకరించాడు. నృత్యాన్ని క్షేత్రయ్య, భజనను రామదాసు ప్రచారం చేశారు.

తిరుపతి దగ్గర తాళ్ళపాక గ్రామంలో నారాయణ సూరి, లక్కమాంబ దంపతులకు



చాలాకాలం పుత్రసంతానం
లేదు. పుత్రునికోసం వాళ్ళు
తిరుపతి యాత్ర చేశారు. గుడి ఆవరణలో
నిద్రపోతుంటే లక్కమాంబకు ఒక కల వచ్చింది.
వేంకటేశుని నందకం అమెగర్భంలోకి ప్రవేశించిన
కల అది. ఆ దంపతులు చాలా సంతోషించారు.
మొదటి తెలుగుపదకర్త అన్నమయ్య 1408వ సం॥
మే 22వ తేదీ జన్మించాడు. అన్నం అంటే పరబ్రహ్మ
స్వరూపం. అందుకే కొడుకుకు ఆ దంపతులు
అన్నమయ్య అనే పేరు పెట్టారు.

చిన్న అన్నమయ్యకు తెలివితేటలు చాలా ఎక్కువ. సంస్కృతం, తెలుగు రెండు భాషలు సునాయాసంగా నేర్చుకున్నాడు. వాళ్ళ ఊరిలో ఒక చెన్నకేశవ స్వామిగుడి ఉండేది. ఆ గుడిలో అన్నమయ్య పాటలు పాడేవాడు. నృత్యం చేసేవాడు.

"ఆడిన మాటెల్ల అమృత కావ్యముగ
పాడిన పాటెల్ల పరమగానముగా"

అంతా చూసి, విని ఆనందించే వారు.

అన్నమయ్యకు ఎనిమేదేళ్ళు వచ్చాయి. ఆ వయసుకే లౌకిక బంధాలపై విరక్తి కలిగింది.

ఓ రోజు బీడులో గడ్డి కోస్తున్నాడు అన్నమయ్య. దూరంగా తిరుపతి వెళ్తున్న యాత్రికులబృందం ఒకటి కనిపించింది. గోవింద నామం చేస్తూ





సాగిపోతున్నారు వాళ్ళు. ఆ దృశ్యం అన్నమయ్యకు నచ్చింది. వెంటనే ఎవరికీ చెప్పకుండా వాళ్ళలో కలిసిపోయాడు. తిరుపతి వెళ్ళిపోయాడు. కొండ మాత్రం వాళ్ళతో కలిసి ఎక్కలేకపోయాడు. ఆకలి అలసట వలన ఒక రాతిమీద పడుకుని నిద్రపోయాడు.

పద్మావతి పండుముత్తైదువగా వచ్చింది. అన్నమయ్యను పిలిచింది. కళ్ళు తెరిచి చూశాడతను. ఏమీ కనిపించటం లేదు. ఆమె ఇలా

అంది "తిరుపతి కొండ సాలగ్రామమయం. చెప్పులు వేసుకొని కొండ ఎక్కటం అపరాధం". ఆ తల్లి మాటలు విన్నాడు అన్నమయ్య. చెప్పులు విసిరేశాడు. స్వామి ప్రసాదాన్ని ఇచ్చింది అమ్మ.



దారిచూపి దీవించింది. అప్పుడు అన్నమయ్య చెప్పిన శతకం అమ్మవారినే కీర్తిస్తుంది. అది శ్రీ వేంకటేశ్వర శతకం.



తిరుపతి కొండపైకి చేరాడు అన్నమయ్య. పుష్కరిణిలో స్నానం చేశాడు. గుడిలో ప్రవేశించి వేంకటేశుని సుందర రూపాన్ని తనివితీరా చూశాడు. ఆశువుగా ఒక కీర్తన అతని నోట వెలువడింది. "కంటి నఖిలాండకర్త నధికునిగంటి" అంటూ పరవశించాడు. తర్వాత కాలంలో ఎన్నో కీర్తనలు స్వామికి పూజా కుసుమాలయినాయి. స్వామి





మీద రాసిన శతకం వినిపించినపుడు మూసిన గుడి తలుపులు తెరుచుకున్నాయిట. వేంకటేశుని ముత్యాల గొలుసు జారిపడి ఆశీర్వదించిందట. వైష్ణవం స్వీకరించిన అన్నమయ్య అన్నమాచార్యు డయినాడు.

"ఎండ గాని నీడగాని ఏమైనగాని

కొండల రాయడే మా కులదైవము"

అని చాటుకుంటున్న కొడుకు దగ్గరికి లక్కమాంబ వచ్చింది. ఇంటికి రమ్మని పిలిచింది. అతని పూజలకు ఆటంకం ఉండదని తెలిపింది. అన్నమయ్య ఇంటికి చేరాడు. కాలక్రమాన తిరుమలమ్మ, అక్కలమ్మ అనే ఇద్దరు కన్యలను వివాహం చేసుకున్నాడు. తిరుమలమ్మ తిమ్మక్కగా 'సుభద్రా కల్యాణం' రాసిన తొలికవయిత్రిగా పేరుపొందింది. రోజూ ఓ కీర్తన రాసి స్వామికి అర్పించాడు అన్నమయ్య. ఈ వ్రతం ఆయన జీవితమంతా పాటించాడు.



అన్నమయ్య కీర్తనలలో భక్తి. అద్భుతం లలితభావనలు, సరళ సంగీతం ఉంటాయి. వినిన వారు ఆనందించే రసస్పందన ఇస్తాయి. నరసింగ రాయలు పెనుగొండరాజు. అతని కోరిక మీద "ఏ మొక చిగురుట ధరమున ఎడనెడు





కస్తూరి నిండెను" అనే శృంగార పదం చెప్పాడు.

"ఆకటి వేళల అలుపైన వేళల వేకువ హరి నామమే! దిక్కుమరిలేదు" అనే పదం అన్నమయ్యకు పడిన సంకెళ్ళని కూడా తెంచింది. ఏడుకొండలు పాము పడగల్లా ఆయనకు కనిపించాయి.





"అదిగో అల్లదిగో శ్రీహరివాసము
పదివేల శేషుల పడగలమయము"
లో భావం అదే!

"బ్రహ్మ కడిగిన పాదాన్ని" శతవిధాలా ఆరాధించాడు అన్నమయ్య.

అన్నమయ్య ఎక్కువగా తాళ్ళపాకలో తిరుపతి లోనే ఉన్నాడు. కొండమీద స్వామి బ్రహ్మోత్సవాల్లో పాల్గొని సేవ చేశాడు. ఆయన పలుకు నిజం అయ్యేది. కర్ణాటక భర్త కవి పురందరదాసు అన్నమయ్యను ఓ సారి కలిశాడు. ఇద్దరూ



తమతమ కీర్తనల గురించి మాటలాడుకున్నారు. స్వామిమీద అన్నమయ్య 32,000 కీర్తనలు రచించి 1503 ఫిబ్రవరిలో సిద్ధిపొందాడు. "నానాటి బతుకు నాటకము" అని నిరూపించి మానవ జీవన నాటక రంగం నుండి మరలివెళ్ళాడు.

అన్నమయ్యకి 16 ఏళ్ళ వయసులో వేంకటేశుని దర్శనమయింది. నాటినుండి రోజూ ఒక కీర్తన స్వామికి అంకితం ఇవ్వాలనే ఆయన నియమం. దాదాపు 80 ఏళ్ళు బతికాడు అన్నమయ్య. తిరుపతిలో స్వామి ఉత్సవాల్లో పాల్గొనేవాడు. అందుకనే వాటిని అందంగా వర్ణించాడు. హంపి

విజయనగరం, అహోబిలం వెళ్ళినప్పుడు దారిలోని వైష్ణవ ఆలయాలను దర్శించాడు. ఆ దేవుళ్ళను వేంకటేశునిగా తలచి కీర్తనలు రాశాడు.

అన్నమయ్య కుమారుడు పెద తిరుమలాచార్యుడు. అతడే తండ్రి కీర్తనలను రాగి రేకులపై చెక్కించి దాచాడు. వేంకటేశుని ఆలయ ఆవరణలో సంకీర్తన భాండాగారం ఉంది. అందులోనే అన్నమయ్య కీర్తనలు భద్రపరచ బడినాయి. తెలుగు సాహిత్యంలో రాగి రేకులపై సాహిత్యాన్ని భద్రపరచటం తాళ్ళపాక కవులకే పరిమితం. ఆనాడు ఈ కీర్తనలు దాదాపు రెండు శతాబ్దాల

దాకా బాగా ప్రచారంలో ఉన్నాయి. కాలక్రమేణా ఎందుకో మరుగయినాయి. 20వ శతాబ్దిలో తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆ రాగి రేకులమీది కీర్తనల్ని ప్రచురిస్తున్నారు. 32,000 కీర్తనల్లో ప్రస్తుతం దొరికినవి 14,358 కీర్తనలే !

ఇవి భక్తి, శృంగార రస ప్రధానాలు. సంగీతం లలితంగా ఉంటుంది. నాదం కంటే భావం ఎక్కువ ప్రధానం. తెలుగులో భక్తిని, శృంగారాన్ని కలిపిన పదకర్తలలో మొదటి వాడు అన్నమయ్య. తన సందేశాన్ని పండితులకూ, పామరులకూ వినిపించాలని భావించాడాయన. కొన్ని పదాలను

సాంప్రదాయకంగా మలిచాడు. కొన్నిటిని జానపద రీతిలో రాశాడు. అన్నమయ్య అలంకారశాస్త్రం కూడా నేర్చుకున్నాడు. సంకీర్తన లక్షణం అనే లక్షణ గ్రంధాన్ని కూడా రాశాడు. ఆయన రాసిన 12 శతకాల్లో దొరుకుతున్నది ఒక్కటే! ద్విపదవాల్మీకి రామాయణం, శృంగార మంజరి రచించాడు.

"ఎంత మాత్రమున ఎవ్వరు దలిచిన" అనే కీర్తనలో వేంకటేశుని సర్వ దేవతారూపంగా ప్రకటించాడు. "ఏ కులజుడైన నేమి ఎవడైన నేమి" లో కులం కన్నా గుణం ప్రధానమన్నాడు. "బ్రహ్మమొక్కటే" పదంలో సమానత గురించి

బోధించాడు. ఆయన చూపిన మహిమలు అనేకం "జో అచ్యుతానంద జోజో ముకుంద" లాలిపాట తెలుగు పాపలకోసం పాడాడు." చందమామ రావే, జాబిల్లి రావే" అంటూ చందమామని మన గడపలోకి దించాడు. ఉగ్గుపాటలు, సువ్విపాటలు, గాలి, నీరు, ఆకాశం, బిడి, బడి, గుడి..అన్నమయ్య పాటలే! "హరి అవతారమితడు అన్నమయ్య" ఆ భక్త కవికి శతసహస్ర వందనాలు.

★ ★ ★